దృష్టాంత మేమనగా — రాబోవు 8 వ మనువు సావర్ణి కాలములోని సప్తర్షులను నిర్ణయించుటలో భారతయుద్ధమునను దత్పూర్వము నున్నట్టి కొందరి పేర్లు వ్రాయబడినవి. అశ్వత్థామ, కృపుడు, బాదరాయణుడు ఋష్యశృంగుడు, పరశురాముడు మున్నగువారా మనువు కాలములో సప్తర్షులుగాను బలిచక్రవర్తి యింద్రుడుగాను చేర్చబడిరి. దీనినిబట్టి తేలినదేమన, కృపాశ్వత్థామ. పరశురామ బాదరాయణాదులు జన్మించి జీవించినపిమ్మటనే యీ మన్వంతరాల నిర్ణయములు జరిగినట్లు ధృవపడుచున్నది. అనగా భారత యుద్ధకాలము తర్వాతనే యీ మన్వంతరాలన్నియు నేర్పడినట్లు స్పష్టపడుచున్నది. దీనిని కప్పిపుచ్చుటకై వీరిని చిరకాల జీవులుగా చెప్పిరి.

"శ్లో॥ అశ్వత్థామ బలిర్వ్యాసో, హనుమాన్యశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే స్థిరజీవినామ్॥"

అని యొక ప్రమాణము ప్రచారమొనర్చిరి.

ఇక మన్వంతరాలు పూర్వమెట్లున్నదియు, వాని నేవిధముగ మార్చినదియు కనుగొందము. స్వాయంభువమనువు మొదలు మన పురాణములందు లెక్క కనుబడును. ఆయనక్రింద 10 మంది రాజులుండిరి. ఉత్తానపాదుడు, ప్రియంవదుడు మున్నగువారు. రెండవమనువు స్వారోచిషుని క్రింద 11 మంది రాజులుండిరి ద్యుమత్సేనుడు. రోచిష్మతి మున్నగా గలవారు. ఈ విధముగనే ఉత్తమ, తామస, రైతవ, చాక్షుష మనువులకు గలరు. ఉత్తమ, తామస, రైతవ మనువులు మువ్వురును అన్నదమ్ములే. అందుచే వారి పాలనకాలము హెచ్చుగా గనబడదు. ఈ మనువులందరి వద్దను ఇంద్రుడు, కొందరు దేవతలు, సప్తర్షులు, రాజులును ఉందురనియు శ్రీ మహావిష్ణువు ప్రతిమన్వంతరమున నొక్క యవతారము గైకొనుననియు పురాణములందు గలదు. భగవద్గీతలో ప్రతియుగమున కొక యవతారము వచ్చునని చెప్పబడినది. ప్రతి మన్వంతరమునగాని, యుగమునగాని వచ్చిన విష్ణువులు మానవులేననియు వారికి తల్లిదండ్రులున్నట్లు వారి పేర్లు వివరముగా భాగవతాదులయందున్నవి. వానిని ముందు వివరించెదను. మొదటి స్వాయంభువమనువు మొదలు ఆరవ మనువువరకు 20 తరములకన్న హెచ్చులేవు.



మొదటి మనువు వంశమంతయు లెక్కించినను 32 తరములే కనబడుచున్నవి. ఆ కాలపు జనులు మనుస్మృతిలో నున్నట్లు 400 మొదలు 100 సం॥ల వరకు జీవించి, 50 సం॥ల ప్రాయమున సంతానము బొందుచుండిరని లెక్కవేసినను, 6 వ మనువువరకు గల తరములకు 12 వందల సంవత్సరములు మాత్రమే యగును. మనుస్మృతిలో కృతయుగమున 400 సం॥ చొప్పున జీవించిరని యున్నది. ఈ కాలమును మన పూర్వులు 1704 యుగములుగను. అవి దేవమానములుగను మనకు పెంచి చెప్పుటలో గల యంతరార్థమును మనమిపుడు తెలుసుకొనవలెను. గణితశాస్త్రజ్ఞులు లెక్కలు వేసి సృష్ట్యాది 195 కోట్ల సంవత్సరములయ్యెనని నిర్ధారించిరి. ఇది దేశీయ విదేశీయ శాస్త్రజ్ఞులందరంగీకరించుచున్నారు. ఈ నిర్ధారణ దాదాపు భారత యుద్ధకాలమునకే జరిగియుండును. ఈ కోట్లసంవత్సరములను విభాగించి మన పూర్వ చక్రవర్తులగు మనువులపేరిట మన పూర్వులు మనకు పురాణాదులలో చెప్పదలచిరి. అందుచేతనే ఒక్కొక్క మనుకాలము 284 యుగములు దేవమానముగా లెక్కపెట్టి సరిపెట్టిరి. దేవమానమనగా మనకు సంవత్సరమైనచో దేవతల కొకరోజు. ఈ రీతిగ పురాణములన్నింటను రాజుల కాలములను వీలైనచోట్ల నెల్ల దేవమానములుగా పెంచి చెప్పియుండిరి. ఇక మొదటి ఆరుమనువుల కాలములును, తర్వాత కాలమును తెలుసుకొందము. మొట్టమొదట దేవరాక్షసులు హిమగిరియందు మందరగిరి యను పర్వతప్రాంతమున వసించుచుండిరి. దీనినే త్రివిష్టపమనిరి (Tibet). క్రమముగా కొంతకాలమునకు వారు విడిగా నివసింపజొచ్చిరి. దేవతలకు ఇంద్రుడను హోదాతో నొక పాలకు డేర్పడెను. తర్వాత కొంతకాలమునకు యీ యింద్రరాజధాని అమరావతియయ్యెను. అచ్చటనుండియే దేవరాజ్యము పాలింపబడుచుండెను. దీనినే తర్వాత బ్రహ్మావర్త మనిరి. ఆచుట్టుప్రక్కల నివాసులందరు దేవతలనబడుచుండిరి. వారి దాయాదులు రాక్షసులనబడిరి. వీరందరును * కశ్యపసంతతి. ఈ దేవరాజ్యములో నింకను గరుడ,

* దేవతలనబడువారు మొదట యుత్తరధృవ ప్రాంతమున వసించినవారి సంతతి యనియు, వారచట సం॥ర మొక దినముగా నెంచుదురనియు,